# గణపతి వివాహము

హాస్యము

---

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారికి షష్టిపూర్తి మహోత్సవమును పత్రికలలో చదివితిని. వారిగ్రంథములాంధ్రదేశమున యాబాల గోపాలమునకు చిరపరిచితములుగాన వారి విషయమై యేమాత్రమైన యుపోద్ఘాతమనవసరము. వారికిష్టులందరో కానుకలర్పించిరి. నమస్కారములు చేసిరి. దీవనలందిరి. నేనును నమస్కరించవలెనని తలచివ్రాత పూర్వకమైన వందనములను మానితిని. కానుకలివ్వవలెనన్న, నేనైశ్వర్యవంతుడను గాను. యోచించి, యోచించి యొక మార్గము గంటిని. ఆమార్గము నానమస్కారములనువారికందచేయును. నేనింతవఱకెప్పటికిని కళంకములేని మహానుభావులను గానలేదు. నే నమస్కరించిన వారందరిలో ప్రతి యొకరికిని ఒక్కటైన దోషమున్నదని నాకు తెలియును.

వీరిలో నొక కళంకమును గనిపెట్టి నాయభిప్రాయమునకు సరిగానొప్పువారినిచేసి, వారికళంకమును బాపుటచే నానమస్కారము లందునని తలచితిని. అటు చేయ నిర్ధరించితిని.

వారి యందొక దోషరోపణము చేయుటకై వారిగ్రం థములను భాండాగారము నుండి తీసితిని. ఒకటొకటిగా చూచి తిని. అందు నాటకములు దృశ్యకావ్యములుగాన నేచదువ తలచ లేదు. "నవలలు" "నవీనవలలగు"ట చేపాత్రవగువఱకు నిలుచునో లేదోయని భయపడి కొన్ని చదువనుద్యుక్తుడయితిని. ఒకటి తప్ప మిగిలిన వన్నియును పేరు చూచినమాత్రమున నే త్యజిం చితిని. పూర్తిగా జదువనిదే దోషారోపణము చేయరాదు.

కర్పూరమంజరి సువాసనచే నొప్పారినను అగ్గిపుల్లకు భయపడి, వారిపోయినది. "సౌందర్యతిలక" యందు, సౌందర్య మునకు తిలకము పన్నె పెట్టినను, "భార్యారూపవతి శత్రువ" నునదిజ్ఞప్తికి తెచ్చుకొని, దానినివదలితిని. బాలుని చరిత్రమును రామచంద్రుని విజయము మనకేల? రాజరత్నము నా బోటి సామాన్యుల కందదని దానిని గ్రహించుటకు యత్నించ లేదు అహల్యా బాయిని యుద్ధరంగమందు చూచినతోడనే" "సిగ్గు లేః స్త్రీ చరిత్రమనకేల?" యనినిలిపితిని. "గణపతిని" ఆమూ లాగ్రముగ రెండుభాగముల చదివితిని.

ఈ గ్రంథమమోఘమైనది. సందర్భములకును శైలికిని, హాస్యమునకును మీదుమిక్కిలి పేరునకునుసరిపోయినది. పురాణ మనదగినది. వేర్వేరుమతములకు వేర్వేరు పురాణములున్నవి. ఇదిసర్వమతసమ్మత పురాణము. ఇతర పురాణములలో కథా నాయకుడొక దేవుడు, లేక తదవతారము; చెప్పెడివాడొక ఋషి, వినెడియతడొకరాజు, గ్రంథకర్తమరొక ముని. ఇచ్చట

చెప్పినది కథానాయకుడగు గణపతియే, వ్రాసినది కథానాయకునిచే ముఖస్తముగా విన్నకవియే. అందుచేనిదియే శ్రేష్టమైనది. ఇతర పురాణములందు తత్తదవతారములనే వర్ణింతురు ఈపురాణమందటుగాక, గణపతివంశమును, తండ్రితాతల జీవితములు వర్ణించినారు. వారిజీవితముల నిచ్చియుండుటచే నిది నమ్మతగినది. ఆపురాణములయందు పూర్వకాలపు యాచార వ్యవహారములనే తెలిపినారు. దీనియందీ కాలపు నడవడికలనే దేశభాషయందు గాక మాతృభాషయందు వర్ణించినారు గనుక నిదే మనకు గ్రాహ్యమైనది. ముఖ్యకారణ మింకొకటి కలదు. అవి దేవతల చరిత్రలు, ఇది వారికన్న యొక్కువ మెక్కువగలిగినభూదేవతలచరితము, గాననిదే శ్రేయస్కరము అన్ని విధముల చాలమంచి గ్రంధము. నవరసభరితము. హాస్యరసప్రధానము.

చంద్రుని కొక మచ్చకలదు. దేవేంద్రుని కొకదోషారోపణమున్నది. పరమేశ్వరుడు విషముమ్రింగెను, లక్ష్మీవల్లభుడు నల్లనివాడు, మన్మథుడనంగుడు, బ్రహ్మకర్చనలేదు. గణపతి పురాణమందు మాత్రము ఆది మధ్యములలో నాకే కళంకమును వెదకినను చిక్కలేదు. కొనయందు మాత్రము యొకచిన్నయనుమానము వచ్చినది. కథముగియలేదు. కథానాయకుడు పరిగిడి పోయెను. దేవతలవలె యంతర్ధానము కాలేదు తర్వాత కథనింత వరకెవరికిని చెప్పలేదని నాయందోశము.

అయినను మన నరసింహముగారు పేరు ప్రఖ్యాతిగాం

చిన వైదిక బ్రాహ్మణ శ్రేష్ఠులై, హిందూమత ధర్మ శాస్త్ర పారంగతులై, కావ్యనాటకాలంకార లక్షణము లందారితేరిన వారై ప్రాపంచిక సుఖ దుఃఖాంబుధినీదినవారై మనగణపతిని, కథానాయకుడగు గణపతిని, పాతిక సంవత్సరములుదాటినగణపతిని, ఏవృత్తి యందుదిగినను "బహద్దరు రాఫీడు" యనిపించుకొని సంపాదించుకొని సుఖముగా బ్రతుకు గణపతిని అవివాహితుని జేయుట ధర్మమా? యని, కొందరాశ్చర్యపడుదురు, కొందరు విచారింతురు, మరి కొందరు దుఃఖింతురు.

బ్రహ్మశ్రీ నరసింహముగారు గొప్పగ్రంథకర్తలై గణపతి చెప్పుచున్నను తామైనను స్వతహాగా వివాహమును ప్రాప్తి చేసి యుండినబాగుండునని కొందరి యభిప్రాయము. వారటు వ్రాయుటకు కొన్ని కారణములున్నవి. గణపతిగారు తమకథను వ్రాయుచున్నపక్షమున కొన్ని శాపము లిడియుండిరి. తాను చెప్పినంత వ్రాసిన నతనికి సంతోషమని తలచిరేమో, ముఖ్యముగ వ్రాసిన గణపతి మరేమి శపించునని భయము చేతనో తర్వాత నెప్పుడైనను నగపడి యామహా పురుషుడు తన ముందు కథచెప్పినప్పుడు మూడవభాగము వ్రాయవచ్చునని [illegible] పాఠకుల యసమాధానమునకు లోబడి వారువిమర్శించుట తాము వ్రాయకుండుట మంచిదని నిలిపినారు.

గతరాత్రియిట్లులనే చింతించుచు రెండుజాములు గడచిన పిదప నిద్రగాంచితిని నిద్రలోనొకస్వప్నముగంటిని. అందుమన నరసింహముగారు, వర్ణించిన గణపతిగారే ప్రత్యక్షమై వారి

పురాణమును జదివినందుకు నన్ను దీవించి. „వివాహభాగమును నే జెప్పెదను, మీరు వ్రాయవలెను” ననిరి. నేనాశ్చర్యమగ్నుడనై, „నేనెక్కడ, నరసింహముగారెక్కడ, వారికిని నాకును హస్తిమశకాంతరము, సముద్రబుద్బుదాంతరము, కొండలోగుండ్రాతివలె ఆకాశములో చుక్కవలె,” యని యనుకొనునంతలో వారు గ్రహించి „అటుగాదు వారికిమరల తొందర నీయతలచలేదు. వారువృద్ధులు. సంసారసుఖములనే మరచియుందురు. ఇప్పటికి షష్టిపూర్తి, వారివివాహమే జష్తియున్నదో లేదో. చిన్నవారు వ్రాయతగినది వివాహభాగము; ఇది నావివాహ విషయమే గనుక దీనికా పేరు. రెండుతూరులువిఘ్నములైనను మూడవ తూరి నిర్విఘ్నముగా నావివాహము జరిగినది. ఇకమీబోటి వారు వ్రాసినయెడల చిలకమర్తిగారేమియు ననుకొనరు. వారికి బాలురపై ప్రేమ, ఆకారణముచేతనే నాబాల్యమునంతయు వ్రాసినారు. మీరుతప్పులు వ్రాసినను వారు తిద్దుదురు నేనుసీకు నమ్మకమిచ్చెదను. నేనేవారిని మరలవ్రాయుమనుటకు, వారినుండి వెడలి వచ్చిమరలవారివద్దకీపనికిబోవుట మర్యాదగా నుండదు. తొందరయిచ్చుటకుకూడ ఇష్టములేదు. మీరేయీ కార్యమును చేయవలెనని నాకుచెప్పితి.

చిలకమర్తిగారికే యన్ని శాపములబెట్టిన గణపతికినేను భయపడనా? మాటలాడక యొకక్షణమూరకుండి „సరే” యనియొప్పుకొంటిని. వారుకథనుచెప్పిరి. దానినిటూచా తప్పకుండ నాకలలో చెప్పినట్లు వ్రాయుచున్నాను.

# II

ఇట్లు గణపతి కల్యాణ గృహమునుండి కాలికిబుద్ధిచెప్పి యదృశ్యుఁడై ఆయింటిపెరటిలో దాగుకొనెను. ఎంతటిపోలీసు వారంటైనను బహిర్భూమికి కూర్చున్నంతసేపు మాత్రమేమి భయములేదుకదా. గణపతి బుద్ధియిటువంటి వాటిలోయస మానమైనది. దొడ్డిలోకూర్చొని తలుపుమూసెను. రాత్రియా యెను. నిద్రవచ్చెను. గణపతి యచటనే రాళ్లపైన పరుండెను. దానినేనతడిల్లుగా భావించెను ఇటులతడుచేసిన కార్యము నిం దితమని కొందరు తెలియని వారనుకొందరు. మనదేవతల గృ హములెట్టివో కొంచమాలోచింపుడు. సృష్టికర్తయగు బ్రహ్మ వాడిపోయిన నూడిపోవు పువ్వుపైనుండును. శ్రీమహావిష్ణువు సముద్రములో వసించును. ఎప్పుడైనను మునుగవచ్చును లేదా యేతిమింగలమో మ్రింగవచ్చును. ప్రాసాదములుకరవా యత నికి? మహేశ్వరుడు పీనుగల బూడ్చుకాల్చు స్మశానమందుం డును. సూర్యభగవానుడు "ఆకాశం గగనం శూన్యము"ను చోట గాఁకూడ యుండని గగనమందు నివసించును. ఇక లోకమును పుష్పబాణములతో జయించు మన్మథుని కొంప తలపపనియె లేదు. భర్తృహరిమహర్షులనడుగుడు. అంతటిత్రిమూ ర్త్యాదిదేవతలు, పూలమీద నీళ్లమీద స్మశానమందు శూన్య స్థలములందు నెలవుల ననవరతము చేసికొనగా మన గణపతి పోలీసు వారంటునకు భయపడి గుండెలు పీచు పీచుమని కొట్టు కొనుచుండ నాలుగుఝాములు మాత్రము ప్రతిదినము మను జుడు పోవక తప్పించుకొనలేని దొడ్డిలో పరుండినతప్పా. ఆతని

యున్నవారేతప్పు. రాత్రిపిశాచముల భయముగనుక నక్కి డనే నిద్రించెను. ఆనాడు ఆవకాయగూనకుచేరి నిద్రింపలేదా? బండి పడిపోయినపుడు నిదురించువానికి తెలివివచ్చెనా? ఈనాడు కూడ అదేనిద్ర. అంతకన్న యెక్కువనిద్ర. అరుణోదయముననే లేచి ఇటు అటు ఎవరులేకుండుట చూచి పారిపోయెను. పరుగిడుటయందతడు చిన్నప్పటినుండి పేరుగాంచినవాడు. ఆనాడు ఖరారోహణము చేసిన తరువాత మేనమామచేత దెబ్బలకు వెరచి పారిపోయినట్లు పోలీసు వానిని తలచుకొని యంత రెండంతలుగా పరుగిడెను.

ఒకచిన్న పల్లెకుపోయి యచట మునుసబుకరణాలను చూచి తానుపురాణపు బ్రాహ్మణుడను యాపూట సామగ్రిని ప్పించుకొనెను. వారితనికొక పడిబియ్యము, దానికి తగినఇతర సామగ్రి రెండు ముంతల పాలు పెరుగునిచ్చిరి. మిగిలిన యన్నము పాత్రలు తోమువాని కగునని తలంచిరి. మనగణపతికి వంట రాదని తలచకూడదు. ఒకకిలయావృత్తి నవలంభించి యొక ఘాంటమాత్రము వంటచేసి తిట్లుతిని వచ్చిన మహానుభావుడు. తానుజేసినది తనకు రుచికరముకదా? వారిచ్చిన పదార్థమంతయు నొకప్పూటకేవండి లకోటాకు మెతుకు లేకుండ మందుకైనను పాలు పెరుగు మిగిలించక, భోజనముచేసెను. పప్పుబొట్లవారి వంశీకుడైన గణపతికిది సహజమైనను గ్రామస్థులకు యాశ్చర్యమును కలిగించెను. రాత్రి భోజనానంతరము పురాణమున కేర్పాటు చేయదొడగిరి. సాయంకాలమే మన గణపతి యూ యూరలేడు,, పురాణమున కీ...రే...వలయునా” యనుకొని కాబోలు యుతడింకొక పల్లెకుబోయెను. పదార్థమిచ్చిన వారి

విషయము మనకెందుకు?

ఏదో విధముగా యతడు ప్రాంత్యములను విడచి కర్నూలు మండలమును చేరెను. కర్నూలు గొప్పపట్టణమనియు అందు ద్రవ్యార్జనయు, దానినుండి వివాహముకూడా జరుగునని తలంచెను.

ద్రవ్యార్జన కతడే వృత్తి నవలంబించవలెను? బిచ్చమెత్తి దాతలను బెదరించెను. నిరక్షర కుక్షియైనను, ఉపాధ్యాయ పదవిలోనుండి ప్రధానోపాధ్యాయత్వము స్థాపించెను. నాటకమున కృష్ణవేషధారియైనపుడు "మాధవా మన దేయూర" నియనుగ "మనదిమందపల్లిగాదట్రా, తెలియనివానివలెనడిగెదవని" నిష్కపటముగా చెప్పెను. వంటలవాడై, నలపాకభీమపాకములకు సరిగా గణపతిపాకమును కనిపెట్టెను. కోడిని పెంచి పందెములో ద్రవ్యమార్జించవలెనని ప్రయత్నము చేసెను.

"యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః"

ఇవన్నియు నతనికి మరలనచ్చలేదు. క్రొత్తవృత్తిలో దిగవలెనని తలంచెను. వివిధవృత్తులనాలోచించెను. వర్తకులితర జాతులకన్న ధనవంతులని తెలిసికొని వ్యాపారము చేయనుద్యుక్తుడయ్యెను. చిన్నప్పుడు తనతోడి బాలురలో వర్తకుల బాలురవద్ద చాల డబ్బుండుట చూచియుండెను. వ్యాపారమునందరికిని మోసముచేసి లాభము ఎక్కువగా చేసికొని ద్రవ్యమార్జించి వివాహము చేసికొనవచ్చునని తలచెను. వ్యాపారము చేయవలెనన్నను కొంచెము డబ్బు కావలెను.

# III

అప్రైతనుతమునకు చేరినవాడగుటచే, తనది, పరులది యనుభేదములేక, హస్తలాఘవము గలవాడగుటచే, చిన్న చిన్న పాత్రలు మొదలుకొనవెనరయిన యింటిబయటనుంచి నప్పుడు దొంగతనముచేసి, మరలవాటిని ఇంకొక బజారున విక్రయించి కొంతపైకమును సంపాదించి, మంచికోటు, మేజోళ్లు, కండువాదోవతులు సంపాదించుకొనెను. తనకుశుక్రమహా దశవచ్చిన దనుకొనెను.

ఇంతలో వ్యాపారముకూడా మొదలుపెట్టెను? కర్నూలులో కోడిగ్రుడ్లు మతిచేయుట ముఖ్యవ్యాపారము. మన గణపతి కొందరితో స్నేహము చేసికొని బొంబాయిలో గ్రుడ్లను కొనువారి పిలాసాలు కొన్నిటిని సేకరించుకొని గ్రుడ్లబుట్టలను వారికిపంపుటకై, అక్కడినుండి తానుపంపబడినాడనిచెప్పి, బుట్టల నెగుమతిచేసెను. బొంబాయినుండి తనకువచ్చిన పైకమును తానేతీసుకొని అమ్మినవారికియ్యక కొన్ని సెలలుగడిపెను. పెద్దమనిషికదా, ఇచ్చునులెమ్మనుకొనివారూర కుండిరి.

ఎవరైనను, కోడిగ్రుడ్లనమ్మవచ్చునా, బ్రాహ్మణులే మీర" నియడిగినపుడు, గణపతి దానికేమండీ. వ్యాపారము చేయుటకు గ్రుడ్లనేమి, తోళ్లనేమి? గ్రుడ్లకు సంతాన రత్నములనిపేరు. అవివాడుగుగమును ప్రాణములేదు. కూర కూరగాయలతోసమానము. వాటనితిన్నను తప్పులేదు. విత్తనము నుండి చెట్లగును, అండమునుండి పక్షియగును. అదిగాక

తెల్లగానుండును గనక శ్రేష్ఠమైనది కాను ధేనువు తెలుపు, ఐరావతము తెలుపు, ఉచ్చైశ్శ్రవము తెలుపు, సున్నము తెలుపు, చక్రముచామరము కోడిగుడ్డు అన్నియు తెలుపే దీనివ్యాపారము తప్పా? "అనివాక్చటుత్వముచే యాక్షేపించినవారి నణచును ఇంకనుకావలెనన్న, వారిని నిందించును.

వ్యాపారము చేయుచు రెండుమూడుమాసములు గడపెను. సుమారు రెండువందల రూప్యములు సరకమ్మినవారికి పైకమివ్వక తానార్జినటుతలచినను, పూటకూలకర్చుల కేబడి రూపాయలుతగిలెను. సరకువిక్రయించినవారి తగాదా యెక్కువాయెను. వారికనుమానముపుట్టిడబ్బివ్వమనియొకదినము గణపతిని నిర్బంధించిరి గణపతియందులో నిరువదిరూప్యము.. దాచికొని .మిగతపైకమిచ్చి, "ఇదేనావద్దనున్నది" యనిచెప్పెను. "వీనినుండి యెక్కువతీసుకొనుటకు, వీనికేమి, ఇల్లా, వాకిలా" యనికొనుచువారు వచ్చినదాకే సంతోషపడి తమ గ్రహములు మంచివనియనుకొనిరి. పంచాయతికిపోక కోర్టుకెక్కక, ఇంతమాత్రము వచ్చెగదా. గణపతియు "ఇంతేచాలును, దెబ్బలుతినక, పోలీసువారి చేతిలోపడక బ్రతికితిని. శుక్రమహాదశా ప్రభావమిది" యనుకొనెను.

ఇప్పటికి గణపతి యన్నివృత్తులలోను దిగినవాడాయెను యేవృత్తియందును యాతనికి సంపాదనకాలేదు. అన్నివృత్తులు కాగా వైద్యము చేయలేదని చదువరులనుకొనరాదు. ఒకతూరి కర్నూలులోవుండినపుడొక నాహుకారి బిడ్డకు జ్వరము వచ్చి

నపుడు తాను వైద్యుడని మనగణపతి వననాభి ముందుగా
నిచ్చెను ఆబిడ్డ ఆతని మాత్రితో ప్రాణశాంతిని బొందెను. ఇంటి
వారితనినిట్లుగా, "ఉష్ణం ఉష్ణేనశీతలం, అన్నారు పెద్దలు, ఇది
విష జ్వరము అందుకు వననాభి ఇచ్చినాను. విషమునకు విష
మేమందు. నాకు తెలియదా, మీరు మంచివారే, వైద్యునికే
మందులు నేర్పెదరా, ఇదిగో చూడండి నా పెట్టెయెన్ని మందులు
న్నవో" యని కొన్నిటిని చూపి "ఇది పాతాళమృత్తి కాలేహ్యము
దీనిని మా భావిలో దిగి తెచ్చి పుటము బెట్టినాను." ఇంకొకటి
చూపి "ఇది పాదరక్షా లేహ్యము, దీనిని నడచుచు చేయగలి
గింతటివాడను" అని చెప్పెను. వీటిలో నొకటి, భావిలో మన్ను
ఇంకొకటి చెప్పులదుమ్ము. ఇంకను తెలుపు "ఇది విషజ్వరములకు
కాదు, విషజాడ్యములకు విషమే మందు. నాకేమి తెలియును.
పోనియ్యండి, పైకము నాకియ్యండి, నా మందు కాబట్టి
పోతే, వద్దనరాదా, కావలసిన వాండ్లు కూడా నేనప్రయోజకుడని
వైద్యము రాదని జెప్పకండి; మీ బిడ్డకింక మందివ్వనండి" యని
వారిచ్చినంత పైకమిప్పించుకొని పోయెను. వైద్యమందితడు
చూడగనే రోగశాంతిని బొందు మాత్రలను చేసినాడని చెప్పు
చుండును. ఆమందు బలము తనకు తెలిసి కాబోలు నతడెవ్వ
రికిని ప్రయోగింపలేదు. చనిపోయిన రోగిని చూచి తానుమం
దిచ్చియుండిన యెడల వైరాగ్యము మాట్లాడును; ఇంకొకరి
కిచ్చిన యెడల వైద్యునికి తెలియక తప్పుమందిచ్చి చంపినవాడ
నను. ఇటువంటి వాదనలో మంగణపతి కగ్రతాంబూలమియ్యా
వలెను.

కర్నూలులో నుండినపుడు సంఘములో చర్చలు జరుగునపుడు

మనగణపతి, విధవావివాహముల విషయము వినుచుండెను. ధర్మ శాస్త్రమేమో, విధవావివాహము చేయవచ్చునా, కూడదా, యనిమనగణపతికి తెలియదు. అతనికవసరములేదు అతనికీచర్చలు వినుటవలన జీవితసాఫల్యము గలిగినట్లాయెను. ఏలయన నతడిట్లాలోచించెను, "విధవనువివాహమాడిన యెడలనేను సొమ్ము పెట్టనక్కరలేదు. ఏలయన, మొదటిమగడు పెట్టినసొత్తుండును. ఆవిధవా సొమ్మంచుకొనునాసరి, పెట్టుకొనుటకిష్టములేకుండునా, నాకేలాభము. ఆసొత్తునాకేవచ్చును. రెండవది, పెండ్లిఖర్చులులేవు. మొదట పెండ్లికై తలిదండ్రులు ఖర్చుపెట్టియుందురుగాన, నీపెండ్లికిఖర్చుచేయరు. ఒకవేళతలిదండ్రులే లేకున్ననాకు విచారమేలేదు. నాకుకూడ ఖర్చులేదు. ఊరేగింపు మొదలగునవన్నియు జరిగినవి. వధువుకుకూడ జరిగియుండవలెను. అన్నికార్యములకన్నా నెక్కువయినది. పిల్ల ఎదిగియుండుటచే శీఘ్రముగానే కాపురము జరపుకొనవచ్చును. సంసారము మొదలుపెట్టవచ్చును. ఈచిన్నపిల్ల పెద్దదగుచేసికొని ఎన్నాళ్లని గోరదగ్గరనక్క గాచుకొన్నట్లు పడియుండవలెను. అనియాలోచించివిధవా వివాహమునకు నిశ్చయించెను. ద్రవ్యములేనివానికిదే శ్రేయస్కరము. తనబుద్ధికితానే మెచ్చుకొనెను. కొందరితనియింటికి తల్లిదండ్రిశ్రాద్ధకాలమున భోజనమునకు రాకపోవచ్చును. వారుబ్రతికియుండగనే వారికిశ్రాద్ధము బెట్టియుండెను, గనుక యాయాలోచన నివ్వాడవసరము లేదు. బ్రాహ్మణుల యవుసరమంతకంటెను.

---

# IV

తక్షణమే గణపతి విధవావివాహములకు పేరుబొంది న బెంగుళూరికి పోయెను. ఆయూరిలో సన్యావర సమ్మేళన సమాజమునకు వెళ్లి, యచట మేనేజరుగారిని చూచి ,,అయ్యా, విధవరాలిని వివాహమాడవలెనని వచ్చినా” ననెను.

పాపము, మనగణపతికి గృహమందు విధవావివాహము లక్కై పాటుపడరని తెలియదు.

ఆయినను, ఆ మేనేజరు తన యంతరంగములో నవ్వు కొని, ఇతనిని వేళాకోళము చేయనెంచి

,,విధవరాలు కావలెనా? ” యనియడిగెను

,,అవును”

,,యెన్నేండ్లది?”

,,చూడండి—నాకీడు జోడగనుండుటకు”

,,మీస్థితి యేమాత్రము?”

,,నేను సంసారము చేయగలను ఐశ్వర్యమెందుకు? వెంటవచ్చునా? భార్యాభర్తలు బాగుండినచాలును”

,,ఒకవిధవరాలున్నది; ఇరువదేండ్లు, చూచెదరా?”

,,మీమనసుకు వచ్చినసరే”

అంతలో యకస్మాత్తుగా యాంతోటవలో నొకచిన్నవిధవపోవుచుండుటగాంచి, యామేనేజరు, కిటికిలోనుండి గణపతికి చూపి ,,ఆమెబాగున్నదా?” యనెను.

,,అబ్బే! బోడిముండే?” యనిగణపతి యాశ్చర్యపడెను. మేనేజరు తెలియనటునటించి ,,మీరునకేసికిగాన్నువచ్చినారా? యనెను.

„అవునండి—ఆ దేమితలవె టు్కలు లేవు, నల్లచీర లేమ కురూపికై నాకురు లే శృంగార” మన్నారు పెద్దలు అనెను. మేనేజరుగారు హాస్యమును పెంచుచు „కాదండి—తల వెండ్రుకలు లేనియెడల యుపయోగము లెక్కువ—మీకుపసుపు, నూనె, సీకాయఖర్చు లేదు. పిసకపట్టదు. వాసనరాదు. శుభ్రముగానున్నగానుండును. కురూపికై నాకురు లే శృంగారమని” చెప్పినను, మనయాడువారు తల దువ్వకొనడము, వాసననూనెలుపూసుకొనడములోనే పొద్దుగడపి యింటిలోపనిపాటలు చేయరండి. మీ రాలోచనచేయండి.” „అవునండి! నిజమే”

„మనవారికి తెలియదండీ క్రొత్త పద్ధతి నవలంభించుటకు వెరతురు. బోడిముండను చేసికొనుటకు కారణములేకనే భయపడుదురు. మేముపెద్దవారైనాము. మీబోటివారు సంఘసంస్కరణముచేసినట్లుగును. మీకుమిక్కిలి యెక్కువయుపయోగము లున్నవి”

„మఱికొన్ని చెప్పండి”

„యెఱ్ఱచీరలు నల్లచీరలన్న ధరతక్కువ, వీరితరులకన్న త్వరలో చీరలుకట్టుదురు. మనపాతపద్ధతి ప్రకారము చీరకట్టు కొనువారు గోచిపెట్టుకొనునంతలో వానగాలివచ్చును. యెందరికోఆకువారి ఆడంబరముచే తైలుతప్పును. నవీనపద్ధతిప్రకారము గోచిపెట్టరు. ఆయాచారము బోడిముండలకే. స్నానము చేయవలెనన్న మనవారికి గొప్పచిక్కు. రవికె విప్పవలెను. వీరికి రవికెయాచారమే లేదు. మెడలో దారముతెట్టుకొనదు. విశేషముగా యాచారములు పెట్టుకొనినంత మనకేకష్టము, నష్టము. భోజనమునందుకూడా వీరే

మేలు" "అదెట్లు"

"మీకు తెలియదా? భోజనముయొక్కపూసే, రెండవపూట కొందరుమాత్రము కలిగినవారు ఫలహారముచేతురు. మీబోటివారిభార్య విధవకు ఫలహారమునకేమికొరత? మీవిధవను మహారాణిలా గుంచగలరు.

"సరే"

"ఇంతేకాదు వీరిని వివాహమాడినయెడల సంసారము రహస్యముగా నుండును! నిశ్శబ్దం బహ్మచ్యతే అన్నారు వెనుకటికి

"యెట్లాగ?"

విధవలకు ముక్కునపుడక, చెవులోకమ్మలు, కాళ్లకందెలు, నడుముడాబు, యేమియులేదు. నడచినయెడల నిశ్శబ్దం మనవారన్నట్లో గల్లుగల్లుమని భోగమని నాట్యమాడినట్లుండును. సంతలో బై సికల్ గంట వాయించినట్లుండును.

యెక్కడనో చూచువాడుకూడా నిశ్శబ్దముచే యాకర్షించబడి తిరిగిచూచును. విధవశబ్దముచేయదు. యెవరు చూడరు. పాతివ్రత్యమునకు భంగములేదు. ఏచరిత్రములో దిగినను మీరు మీభార్య నిశ్శబ్దముగా నుండవచ్చును. మీకుమంచిది, ఇతరులకు మంచిది"

"వీరు పతివ్రతలెట్లగుదురు?"

"అయ్యో? పాతివ్రత్యమునకేమి? బంగారువలె స్వచ్ఛమే వీరుబహుపతివ్రతలు. ఒకమగని పోగొట్టుకొని యేడ్చియుందురుగాన, విధవలకు భర్తలపైచాలప్రేమ. ఇంకా కావలనన్న నూటపదహారు గుణములనివ్వగలను. చెప్పుటకు,

వినుటకు నీకనుకూలపికయుండవలెను. వేయేల. చేసికొని సుఖపడవలెను, నాయుపదేశము ప్రభావము అప్పుడు తెలియ యును చూడండి."

మీరుచెప్పినది నచ్చినదికాని, ఇతరులుచాలమంది చేసికొనలేదే అనియాలోచన.

"చెప్పితినే, మనవారికితరుల త్రోవతప్పిన నేమందురో యను భయము పిరికితనమేనండీ. అంతస్వతంత్రముగా నుండిన మనికెప్పుడో స్వరాజ్యము వచ్చియుండును. భయపడితాము దుంకరు, ఒకరినిదుంకినివ్వరు."

"మీవంటిగొప్పవారు చిక్కినందుకు నాయదృష్టము మన చెప్పుదును. మీరు నాయజ్ఞానమును పారదోలినారు. మీరు చెప్పినట్లుచేసెదను. మీరుచెప్పిన విధవనేచేసికొందును మీరే వివాహము చేయించవలెను. ప్రకృతము ఖర్చులకేమి యు లేదు.

"ఖర్చులకగ రలేదు. విధవపెండ్లికి కర్చులా?"

"సరే మీరే యేర్పాటు చేయండి—మన గణపతికి వివాహమైనదనినచాలు. విధవయైననుసరే, అందులో రూప మెట్లున్నను సరే. గుణములు నడవడిక మగనియాధీన మని తెలియును "భార్యతప్పు మగనిది" యనిపెద్దలమాట.

మేనేజరుగారు విషయమింత దూరమువచ్చునని తలచ లేదు. విధిలేదు. తానేజేయవలసివచ్చెను. ఒకవర్తకునింటి చిన్న విధవరాలినితెచ్చి వివాహముజరపిరి. వివాహమనగా పూల హారములు వేసికొనుట. తర్వాత గణపతికి కోమటిబోడి దని తెలియగా "వ్యాపారమునకు పనికివచ్చున"ని సంత సించెను.

# V

గణపతిగారికథ నిక్కడికి చెప్పగానె గస్తీతిరుగు పోలీసువాని యీలవినబడెను. స్వప్నభంగమాయెను. గణపతిగారు వారిసంసార విషయమేమైన చెప్పదురేమో యనికుతూహలపడితిని. వారుమరలరాలేదు. చెప్పలేదు. నాయదృష్టమో, గణపతి దురదృష్టమో యనుకొంటిని. అయినను వారి ముందుచెప్పినట్లు వివాహముముగిసెను వారికోరికే ఈడేరెను. గణపతిగారు తదనంతర కథను నాకెప్పుడైన మరల చెప్పిన వ్రాసెదను. లేదా, యెవరికైనను స్వప్నములో కనబడిగాని యింకేవిధముగా గాని, చెప్పినప్పుడు వ్రాసిన, చదువుటకు సంతసించెదను.

గణపతికి వివాహమెక్కడిదని కొందరికి యనుమానములు కలుగవచ్చును. మా గణపతికి తగినవివాహమే అయినది. సంకోచమున కాస్పదమే లేదు. తెలియనివారుమాత్రము వారిష్టము వచ్చినట్లుచెప్పవచ్చును. బుద్ధిమంతులు మా గణపతి చరిత్రము నాక్షేపించరు. ఆక్షేపించువారు గణపతి శాపములకు బద్ధులు.

ఈవివాహము సీతాకళ్యాణమునకన్న, దమయంతీ స్వయంవరములకన్న, రుక్మిణీ పరిణయమునకన్న, శ్రేష్ఠమైనది. దీని చదువనివారికి కొన్ని శాపములను. గణపతిగారే పెట్టియున్నారుగాన, శాపములు తగులకుండుటకైన, దీనినందరు చదువుదురు, లేక వినెదరు గాక. ఈకాలమున సంతానైశ్వర్యాయురారోగ్యములెక్కువగాకున్న మానె, మా గణపతి శాపములు తప్పిన చాలును. (తెం. అ)

---

## మా స్వంత ప్రచురములు

పిల్లల కథలుః—

1 డం డం దేవుడు

II పులియా! ఎలుకా!

జీమూత వాహన చరిత్ర

కర్నూలు జిల్లా చరిత్రకథలు

తంత్ర సారవు

ఐదుశక్తి వారద పాడు

దివిసి పాడు

టీగర పాడు

బళ్లారి జిల్లా పుణ్యక్షేత్రిగళు

టీకాచార్యర చరిత్రె

చిప్పగిరి విజయరాయర చరిత్రె

చేళిన పాడు

---

అచ్చులో నున్నది (మూడు రహస్యములు)